




# అక్షరాంజలి

మాస పత్రిక

ప్రతి అక్షరం జనహితం

సంపుటి : 15, సంచిక: 08 జూన్-2024 పేజీలు :76, వెల-20/-



## నాన్నకు ప్రేమతో...







# అధికారం పోయినా మారని కే సి ఆర్ ఫ్యూడల్ మనస్తత్వం - పతనం అంచున బీ ఆర్ ఎస్



డా. కొప్పరపు నారాయణ మూర్తి

తెలంగాణాలో కొత్త ప్రభుత్వం వచ్చి మూడునెలలుపైనే అయింది. రేవంత్ రెడ్డి ముఖ్యమంత్రి అయి 'వాడు మగాడురా బుజ్జి' అని అనిపించుకున్నాడు. ఎక్కడో కథలలో, సినిమాలలో నాయకులు, నాయికలు చేసిన ప్రతిజ్ఞలను నిలబెట్టుకోవటం చూస్తుంటాం. చూసి బయటికి వచ్చి 'అది సినిమా కాబట్టి సాధ్యమైంది. నిజజీవితంలో అలా ప్రతిజ్ఞ చేసి నిలబెట్టుకోవటం మాటలా?' అనిఅనుకొంటూ ప్రేక్షకులువెళ్లి పోవటం కూడా చూస్తుంటాం. కొన్నేళ్ల క్రితం (మే 31, 2015 న) స్టీఫెన్సన్ అనే ఒక నామినేటెడ్ ఎం.ఎల్.ఏ. ఓటు కొనుగోలు చేసేందుకు రేవంత్ రెడ్డి 50 లక్షలు తీసుకెళ్లి అతనికి ఇస్తున్న సమయంలో తెలంగాణా ఏ.సీ.బి. ఆయనను అరెస్ట్ చేశారు. అవి కొత్తగా ఏర్పడిన తెలంగాణాలో కొత్త ప్రభుత్వం పాలనా పగ్గాలు చేపట్టిన తొలి రోజులు. ఇక టీ.డీ.పి.కి తెలంగాణాలో భవిష్యత్తు లేదని, ఆ పార్టీ జెండాపై గెలిచిన ఎం.ఎల్.ఏ.లను ఒక్కొక్కరిగా తన ఫార్మ్ హౌస్‌కు పిలిపించుకొని గులాబీ కండువాలు కప్పారు కే.సీ.ఆర్. అయితే అందుకు ప్రతిగా టీ.డీ.పి. కూడా ఎం.ఎల్.ఏ.లను కొని దెబ్బకు దెబ్బ కొట్టాలని చేసిన ప్రయత్నం బెడిసికొట్టడంతో రేవంత్ రెడ్డి రాజకీయ బలి పశువు అయినది వాస్తవం. నాడు టీ.డీ.పి.లో రేవంత్ రెడ్డి ఒక సాధారణ ఎం.ఎల్.ఏ. మాత్రమే. కానీ, రేవంత్‌ను అలా ఆరెస్ట్ చేయటం వెనుక కే.సీ.ఆర్. చాలా కుతంత్రమే నడిపాడని నాడే అందరికీ అనుమానం కలిగింది. నాటి టీ.ఆర్.ఎస్. టీ-టెలివిజన్, మరో చంద్రబాబు వ్యతిరేక ఛానల్ ఎన్.టీవి సంయుక్తంగా ఒకేసారి ప్రసారం చేసిన ఆ దృశ్యాలు చాలా మందిని సంశయంలో పడేసిన మాట నిజం. ఆ ప్రసారం జరిగిన తేదీనాడు తెలుగు రాష్ట్రాన్ని పాలిస్తున్న చంద్రబాబు ఒక ముఖ్య కార్యక్రమంలో ఉండగా హైద్రాబాద్‌నుంచి ప్రసారం ప్రారంభమైంది.

నాడు ఆంధ్రాపట్ల వ్యతిరేకతతో అవతరించిన తెలంగాణా రాష్ట్రం కావటం మూలానా, చంద్రబాబుకు వ్యతిరేకంగా తీవ్రమైన వ్యాఖ్యలు కే.సి.ఆర్. తరుచూ చేస్తుండటం వలన అందరి దృష్టిలో చంద్రబాబే చేయరాని నేరం చేసినట్లయింది. అందుకు ఆయనపై ఏ.సీ.బి..తో కేసులు పెట్టించాలని చాలా పెద్ద ఉద్యమమే జరిగింది. ఆశ్చర్యమేమంటే టి.డి.పి. ఎం.ఎల్.ఏ.లను ఫార్మ్‌హౌసులో కొనుగోలు చేసి, గులాబీ కండువా కప్పి, వారిలో కొందరిని మంత్రులు చేయటం వంటి కే.సీ.ఆర్. రాజ్యాంగ వ్యతిరేక చర్యలు అనైతికమని ఎవ్వరూ వాదించలేదు. అంటే హైదరాబాద్ కేంద్రంగా ఆంధ్ర రాష్ట్రం మీద, చంద్రబాబుకు వ్యతిరేకంగా ఒక వర్గం కూడగట్టటం ప్రారంభించిన కే.సీ.ఆర్. ఆ పరంపర ఇంకా కొనసాగిస్తూనే ఉన్నాడు. ఇటీవల సమయం సందర్భం లేకుండా చంద్రబాబును ఇష్టం వచ్చినట్టు మళ్ళీ మాట్లాడటం చూస్తే కే.సీ.ఆర్. ఫ్యూడల్ భావజాలంలోనే ఇంకా మునిగి తేలుతున్నాడనిపిస్తుంది.

అయితే, నాడు అరెస్టయిన రేవంత్ ఎదో ఒకనాడు తానూ ముఖ్యమంత్రినై 'దెబ్బకు దెబ్బ' తీసితీరుతానని జైలు బయట బహిరంగంగానే ప్రతిజ్ఞ చేశాడు. చివరికి భగవంతుడు ఆ అవకాశం ఇదే జీవితంలో ఇవ్వటం, రేవంత్ ముఖ్యమంత్రి అయి తన ప్రతిన నిలబెట్టుకునే సమయం రావటం – కే.సీ.ఆర్. టీవి ఛానెల్స్ ముందు అనాగరికమైన భాషలో రేవంత్‌పై విషం గక్కటం ఆయన పతనావస్థను చెప్పకనే చెబుతోంది. నాడు, రేవంత్ అరెస్ట్ అవడానికి కీలకమైన టెలిఫోన్ టాపింగ్ ఎవరు చేశారో వాళ్ళు ఇప్పుడు పట్టుబడ్డారు. వారిపై పోలీస్ సిట్ పరిశోధనా టీమ్ విచారణ జరుపుతోంది. టూకీగా అనేక విషయాలు బయటికి రావటం చూస్తే, అన్ని వేళ్ళూ కే.సీ.ఆర్. వైపే చూపిస్తున్నాయి. నిజానికి నాడు చంద్రబాబు ఇదే మాటన్నాడు. 'ముఖ్యమంత్రిగా తన సంభాషణలను ఎవరో టాప్ చేసారు. అలా టాప్ చేసేందుకు ముందు వారు కేంద్రం నుంచి అనుమతి తీసుకోలేదు. అందువల్ల అది నేరం. ఆ నేరం కింద కే.సీ.ఆర్. ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయాలి' అని. ఆలస్యం అయినా 2023 నాటికి తెలంగాణా ప్రజలే కే.సీ.ఆర్.ను డిస్మిస్ చేసారు.

ఇక 2023 ఎన్నికల్లో ఓటమి తరువాత టీ.ఆర్.ఎస్. (బి.ఆర్.ఎస్) నాయకులకు మెదడులో గుజ్జు చితికిపోయి నట్లయింది. ఒకరు రేవంత్ ప్రభుత్వాన్ని కూలదోస్తామని, మరొకరైతే మరో అడుగు ముందుకేసి ఆరునెలల్లో మళ్ళీ కే.సీ.ఆర్. ముఖ్యమంత్రి అవుతారని సంధి ప్రేలాపనలు మొదలు పెట్టారు. రేవంత్‌ను పాలనాపరంగా ఇరుకున పెట్టటానికి బి.ఆర్.ఎస్. వాళ్ళు చేయని ప్రయత్నం లేదు. ఇచ్చిన హామీలన్నీ




నెల రోజుల్లోనే అమలు చేయాలని, రైతుబంధును'అధికారంలోకి వచ్చిన రోజునే అమలు చేస్తానని రేవంత్ అన్నాడు కాబట్టి వెంటనే నిధులను విడుదల చేసి రైతుల అకౌంట్లలో వేయాలని, ఇలా గంటకొక, రోజుకొక దాడి ఆయనపై, ఆయన ప్రభుత్వంపై. ఇలా కే.టీ.ఆర్, హరీష్ రావు చెలరేగిపోవటం వెనుక ఒక పెద్ద వ్యూహమే వుందని రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు.

రేవంత్ రెడ్డి అధికారంలోకి రాకముందునుంచి ప్రతిపక్ష నాయకుడిగా కాళేశ్వరం ప్రాజెక్ట్ అంతా అవినీతిమయం అని, తమ ప్రభుత్వం వస్తే దానిపై సమగ్ర విచారణ జరిపిస్తామని చెప్పేవాడు. సరిగ్గా అదే పని చేసాడు. కుంగిపోయిన మేడిగడ్డ బేరేజి వద్దకు ఎం.ఎల్.ఏ.లను తీసుకెళ్లటం ద్వారా, జాతీయ సంస్థలను డాం పరిరక్షణ సంస్థలతో ప్రాజెక్ట్ నిర్మాణాన్ని శోధించటం మొదలైనవి ఆరంభించాడు. అంతేగాక ఒక సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తి ద్వారా నెల రోజుల్లో విచారణ జరిపించి కాళేశ్వరం ప్రాజెక్టు అవినీతికి బాధ్యులని నిర్ధారించటానికి శ్రీకారం చుట్టాడు. రేవంత్ రెడ్డి జోరుకు కళ్లెం వేయడం కే.టీ.ఆర్, హరీష్‌ల వల్లకాలేదు. దీనితో కే సీ.ఆర్.యే నేరుగా రంగప్రవేశం చేసి పొలాలు ఎండిపోతున్నాయని గగ్గోలు పెట్టే యాత్రలు ఆరంభించాడు. అందులో భాగంగానే తాజా రౌండ్ తిట్లు, శాపనార్థాలు రేవంత్ పైన, చంద్రబాబు పైనా ప్రయోగించాడు.

నిజానికి చంద్రబాబును తిట్టడంలో ఆంతర్యం ఏమిటి? అని విశ్లేషిస్తే రేవంత్ చంద్రబాబు ప్రియ శిష్యుడే గాదు, ఆయన రేవంత్‌ను కష్టకాలంలో ధైర్యం చెప్పి ఆదుకున్న వాడు. ఇలాంటి సంబంధమే చంద్రబాబు, కే.సీ.ఆర్.ల మధ్యనున్నది. అయితే రేవంత్ విశ్వాసం ఉన్నవాడు, కే.సీ.ఆర్. అదేమిటో తెలియని వాడు. చంద్రబాబులా రాజకీయాల్లో ఎలా మనగలగాలో నేర్చిన వ్యక్తి కాబట్టే ఒకే జీవితకాలంలో ముఖ్యమంత్రి అవుతానని సవాలు విసిరి ముఖ్యమంత్రి అయ్యాడు. ఇలా చంద్రబాబుకు, రేవంత్‌కు కాలగమనంలో ఉన్న సంబంధాన్ని మనస్సులో పెట్టుకొని, కడుపు మంటతో తిట్టిన తిట్లు అవి. ఇవి అర్థంగాని ప్రజలు ఎవ్వరూ తెలంగాణలో లేరు ఈనాడు. అంతేకాదు, గతంలో లాగా ప్రజలు ఈ సారి కే.సీ.ఆర్. తిట్లను హర్షించలేదు. ఎందుకంటే 10ఏళ్ళు పాలించిన ఒక ముఖ్యమంత్రి, కొత్తగా అధికారం చేపట్టిన ముఖ్యమంత్రిని ఆరు నెలలు కూడా తిరగకుండానే 'రండలు', 'ముండలు' అంటూ తన స్థాయి మరచి ఎవరి మెప్పు కోసం తిడుతున్నాడని ప్రశ్నిస్తున్నారు. ఇది ఒక మాజీ ముఖ్యమంత్రి, అందునా కొన్ని నిర్దుష్ట నేరారోపణలు ఎదుర్కొంటున్న ముఖ్యమంత్రికి తగనిదన్నది ప్రజల భావన.

కే.సీ.ఆర్. ఇలా గంగ వెర్రులెత్తిపోవటం వెనుక మరో విషయం ప్రజలు గమనిస్తున్నారు. ఏమిటంటే కే.సీ.ఆర్. ఏకైక ముద్దుల కూతురు కవితమ్మ ఢిల్లీ లిక్కర్ కేసులో అరెస్టయి తీహార్ జైలులో ఊచలు లెక్క పెడుతున్నారు. ఆమె తాను అమాయకురాలని అంటుంది. కానీ జిల్లాస్థాయి రౌస్ కోర్టు, హైకోర్టు నిర్దిష్టమైన ఆరోపణలు, వాటికి ప్రాథమిక ఆధారాలు ఉన్నాయని అంటూ బెయిల్ నిరాకరిస్తున్నాయి. ఇదంతా మోడీ మాయగా విశ్వసిద్దాం కాసేపు. మరి స్కిల్ డెవలప్‌మెంట్ కేసులో ఏ ఆధారం లేకపోయినా చంద్రబాబును జగన్ అరెస్ట్ చేస్తే కే.సి.ఆర్, కే.టీ.ఆర్ లు ఎంత మాత్రం ఖండించ లేకపోయారు. అందుకేనేమో కవిత అరెస్ట్ విషయంలో కే.సీ.ఆర్, కే.టీ.ఆర్. లు ఇవాళ ఏవిధమైన రాజకీయ సానుభూతి పొందలేకపోయారు తెలుగు రాష్ట్రాలనుంచి. చంద్రబాబును అరెస్ట్ చేస్తే ఉవ్వెత్తున జనం రోడ్ల పైకి వచ్చారు తెలంగాణా, ఆంధ్రాలలో. కానీ, ఇవ్వాళ కవితకు, కే.సీ.ఆర్.కు తెలంగాణాలో ఆ సానుభూతి కరువైంది. ఇదే సమయంలో బీ.ఆర్.ఎస్. నుంచీ వరుసగా వలసల పర్వం ఆరంభం కావటం, తన నాయకత్వానికి మొన్నటిదాకా జైకొట్టిన కేశవరావు, కడియం శ్రీహరి వంటి రాజకీయ యోధులు కాంగ్రెస్ కండువా కప్పుకోవటం, అనేక మునిసిపల్ కౌన్సిల్స్ లో బీ.ఆర్.ఎస్. చైర్మన్లు దిగిపోయి, కాంగ్రెస్ వాళ్లు చైర్మన్లు అవటం, సాక్షాత్తు హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్‌లోని బీ.ఆర్.ఎస్. కౌన్సిల్లర్లు కాంగ్రెస్‌లోకి ఫిరాయించటం కే.సీ.ఆర్. కు మింగుడు పడని విషయాలు.

అంతేగాదు, సరిగ్గా పార్లమెంట్ ఎన్నికలు జరగబోయే ముందు ఇలాంటి తీవ్ర ఒడిదుడుకులు పార్టీకి ఎదురుకావడం, ఆఖరికి ఎలక్షన్లలో నిలబడేందుకు సొంత క్యాడర్ నుంచి అభ్యర్థులు లేకపోవటం వంటివి బీ.ఆర్.ఎస్. ఏటికి ఎదురు ఈదుతున్న సంగతి ప్రజలకు సుస్పష్టం అవుతున్నది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ పార్లమెంట్ ఎన్నికల తరువాత బీ.ఆర్.ఎస్. పతనం అంచున మిగుల్తుందేమోనని అందరికీ సందేహంగా ఉంది. రాజకీయ పార్టీలు ప్రజాస్వామ్యబద్ధంగా కాకుండా, ఏక వ్యక్తి వ్యవస్థలుగా ప్రవర్తిల్లితే ఏదో ఒక నాడు ఈ పరిస్థితి దాపురిస్తుందని నియంతలైన నాయకులు గుర్తెరగాలి. ముఖ్యంగా కే.సీ.ఆర్, కే.టీ.ఆర్ లాంటి వ్యక్తులు తమ ఫ్యూడల్ భావాలు, హోవ భావాలు వదిలించుకొని ప్రజాస్వామ్యబద్ధంగా మెలగటం నేర్చుకోవాలి. ●